మొదటి ముద్రణ
రెండు వేలప్రతులు
నవంబరు 1, 1956.

వెల :
రూపాయి

ముద్రణ :
సాధనా ప్రింటరీ,
హైదరాబాదు.



సోల్ డిస్ట్రిబ్యూటర్సు :
స్వతంత్ర బుక్ సెల్లర్స్ అండ్ స్టేషనర్స్
సుల్తాన్ బజారు (క్లాక్‌టవర్ దగ్గర)
హైదరాబాదు-1.

# నమస్సు

మేము విరచించు సాహిత్యమాలలో నిది తొలి పూవు. మహాంధ్ర జననికి "మంత్రపుష్పం"గా సమర్పించుకొంటున్నాము.

కొందరిని నోటిమాటలతో, మరి కొందరిని మూడు కాసుల కార్డు ద్వారా అర్థించినంత మాత్రాన మా యెడగల అవ్యాజ వాత్సల్యంతో తమ తమ కావ్యకళా ఖండాలను అంద జేసిన కవి పుంగవులకు ఋణపడినాము.

బృహదాంధ్రావతరణ శుభ ముహూర్తమున ఇట్టి కావ్య సంచయమును వెలువరించ మమ్ముల నన్నివిధాలా ప్రోత్స హించిన తెలంగాణా రచయితల సంఘ కార్యకర్తలకు నమస్సులు.

జనగామ యువక సంఘంవారు, ఇంకా ఎందరో మిత్రులు, అభిమానులు ఈ గ్రంథ ముద్రణకు ద్రవ్య సహాయంచేసారు. వారికి మా ధన్యవాదాలు.

ముద్దయిన ముఖ చిత్రాన్ని గీసియిచ్చిన శ్రీ కె. వేంబు, ఆర్టిస్టు (విజయవాడ) గారికి, ఎంతో శ్రమపడి పుస్తకాన్ని అందం గా సమయానికి అచ్చువేసి యిచ్చిన సాధనా ప్రింటరి వారికిని మా నమస్కృతులు.

ఉత్తమ గ్రంథాలను ప్రచురించడం ద్వారా సాహిత్య సేవ చేయడమే మా ఆశయమని ఒక్క మాటలో చెప్పుతూ ఆంధ్రి ఆశీస్సులు, సోదరుల సహకారము కోరుతున్నాము.

2-2-1121
నల్లకుంట
హైదరాబాదు-13.

గౌ. కార్యదర్శి,
ఆదర్శ సాహిత్యమాల

# ఆంధ్రప్రశస్తి

గాసట బీసటే చదివి
గాథలు ద్రవ్వెదునాఁడు, క్రమ వి
న్యాసము సల్పు శిల్పియులి
యంచుల సంస్కృతి బల్కు సత్తపో
వ్యాసుఁడు సన్నహార్యునకుఁ
బంచమ వేదముగా ధ్వనించు వా
చా సముదాత్త మాంధ్రుల ప్ర
శస్తికి కైఁగవ జోయిలించెదన్.

---

పుట్టపర్తి

---

కన్నడపుం జనంబుఁ దెలు
గొప్ప మహాకవి 'పంపఁడ' న్న—మా
యన్న యనుండని రసిక
పోలుఁడు గూర్చిన సూక్తి వాటిలోఁ
జిన్నెలు వన్నెలుఁ గలుగు
జన్నరికైతలు తెన్గువంశపుం
గన్నెల భావసృష్టులట !
గావలెనా ! మరి వేరుభాగ్యముల్.

వింధ్యాద్రివనులలో వికసించు వెనుగు క
త్తుల పొలుగల తళత్తళలు దలఁచి
మల్లెపూవుల తావు లొల్లఁబోవని కొండ
వీటి నాట్యమ్ముల నీటువలచి
తుంగభద్రా సముత్తుంగ వీచీ కావ్య
గంభీర ఘుమ ఘుమల్ కలఁగొనెదికి
పీరబెబ్బులిరౌతు పెట్టిన పొలికేక
రాణించు తందాన తానలు విని

క్షణములో దివి భువి నొక్కగాటఁగట్టు
తిమ్మరుసు మంత్రి శేముషీ దీప్తి దలచి
యాంధ్రుఁడై బుట్టినట్టి పుణ్యంపుబంట
లెంచి నాలోన నేనె గర్వించికొందు.

భద్రగజధీరగతి తామ్రపర్ణిసుండి
భక్తిరసజీవనము చంద్రభాగవరకు
ఆ త్రిలింగేశ్వరుల దయ యవఘళించి
'యాంధ్రి' యన పెత్తుబడసత్తి యాత్మలేదు.

అల నారాయణతీర్థనాదలహరి
వ్యాసంగిపై దొర్లి నా
తెలుగు న్నెలల గుమ్మడాడెనట ! ధిం
ధిమ్మంచు గాలిఫణా
వళ్ళై నాడనవానికన్న మెఱుగై
పంచాతుకీమూర్తి ని
శ్చలుఁడై కంఖుఁడు 'లేసు లేస'న ప్రశం
సా ధక్కా మ్రోగింపగన్.

కదనముఖంబునన్ బిరికి
కండలు గాననివారు ధీరతా
స్పదులగు భర్తలఁద్దవిడి
శాత్రవులన్ దెగజీల్చి వచ్చినన్
పదును దొలంకు వారి కర
వాలపు నెత్తుటన్ గుంకుమాంకముల్
వదనములందు దిద్దుకొను
పత్నులకెల్ల నమస్కరించెదన్.

కలలన్ బోలిన గాథలై మణగ ద్రా
క్షారామ సీమంతినీ
కలపుంస్కోకిలకంఠ కోమల కుహూ
కారంబు లీనాడు నా
తెలుగున్నేతలు విక్రమించిరట! సం
దీపించునా! ప్రాక్తనో
జ్జ్వల పుణ్యాంబులు నింటనింట గవితా
వాసంత మాధుర్యముల్.

మొన్నట బుట్టిరి ద్రష్ట జ
గన్నాథులు పల్కు పొలతి గాదిలిసుతులై
నిన్నటి త్యాగయ్యలు మన
పున్నెమ్ములు నేడు లేకపోవుటయేమో?

బంగరు పంటలిమ్మని కృ
పా పరతంత్రతకు వృద్ధగౌతమి
గంగకు మ్రొక్కి తెన్గు నయ
గారమె శీతలవారి ధారగా
పొంగెడు తుంగభద్ర మది
బుజ్జి యొయారపువెల్లి, గృష్ణవే
ణిం గమనించి యాంధ్రుల క
నిందిత జాగృతినాస జేసెదన్.

వేదాద్రి నరసింహ విపుల వక్షస్స్థిత
కమనీయ కల్హార గంధలహరి
మేడుకొండలరాయ దేహూట కాపూట
భోగించు పచ్చకర్పూరపుతంపు
భ్రమరాంబికా సమర్చా కుంకుమోన్మిశ్ర
పుష్పచంద్రకి తమ్మిబొలుచు చెలువు
శ్రీ కాళహస్తీశ శివతాతి రూపరే
ఖాస్నిగ్ధ సైగనిగ్యములముంపు

కవితగా, గానముగ, చిత్రకళగ, నాట్య
కళయుగా, ప్రతియింట, సాక్షాత్కరించి
ఆంధ్రరాష్ట్రంబు మన భాష నలవరించి
మొదుగుగావుత సంతతాభ్యుదయ మహిమ.

# శ్రీ పర్వము

తెలుఁగు పున్నెము పున్నమి వెలుఁగునేడు!
తెలుఁగు బిడ్డల పంపకాల్ తొలఁగె నేడు!!
తెలుఁగు చలివేంద్రమునఁ బోయు తీర్థములకు
నితరు లాసించు సమయమే యేఁగుదెంచె.

ఓరి పొరుగిండ్ల బిడ్డలు! ఒక్కరీతి
కాలమెన్నఁ డుండదటంచు మేలుకనుఁడు!
అప్రకాశంబుగా నుండియే ప్రకాశ
సంతతిగ మాదు రాజ్యంబు చక్కఁబడియె.

---

ఎక్కిరాల

---

ముదిసిన యౌషధీతరులు
బారుగులంచును గొట్టిపిక నె
వ్వరిగఁ గుమారరత్నముల
మానస వీథులు జ్ఞాన చంద్రికా
స్పదముగఁ బెద్దవారల యు
పాయము సాయముపొంది పొందికౌ
హృదయములొప్ప నాశయము
నిమ్ము విశేషమునాంధ్ర భారతీ!

ఆసువుల్ జీవధనంబు మానమును దా
మర్పించుకొన్నట్టి యా
నిసుగుల్ వామనులయ్యు ముజ్జగముల
న్నిండారఁగా వెన్నెలల్
వినరన్ కొందరు భేదభావముల గు
ప్పింపఁగ యశః కౌముదుల్
మసిపూయం దలపోయ మండలమునన్
మచ్చై విజృంభించెడిఁ.

శ్రీ పర్వము

ఏడుగు నెత్తావురాల శేషున్న పడ(గ్రై
వదర సంఘ్రాసాట్ల పూవరింప
వటుల దంష్ట్రాకోణ చంద్రరేఖను దెగ్గ
భువిమెత్త హర్మ్యక. భూ(ద్రపోణి
భద్రపీఠికపైన భద్రాద్రి రామయ్య
తెను(గు సీతనుబ్రోచి తెప్పించినట
విజయవాటీదుర్గ విజయోత్స వమ్ములో(
జటుల సింహమురేగి సటల విద్రుప
పెనుకొండలరేడె యిలవేల్పు తానౌచు
పాయకుండెదనని బాస సేస(గ(

గోరిముక్కోటి దేవతల్ కొలువు దీర్చి
దివ్యమందార వృష్టి చిందించు కొం(ద్రు
కార్ముకాశ్లిష్ట లగ్న దృక్కాంతులందు
నాంధ్ర గురుశక్తి శుభవాక్కు లంద(జేయ.

# ఐక్యత్రిలింగము

కాళేశ్వరస్థమును శ్రీ
శైలస్థిత లింగమొండు శ్రీ దాక్షారా
మాలయ విలసితలింగము
త్రైలింగత దనరె భారతక్షోణివయిన్.

ఈ త్రిలింగ సీమాంత ర్మహితలమ్ము
జనవినుతమై త్రిలింగదేశముగ వెలసె
ఈ త్రిలింగమ్మె తెలుగయ్యె ఈ దినమ్ము
తెలుగునాట ముక్కోటి దివ్వెలు వెలింగె.

వానమామలై

ఆత్మబలిదానంగ 'అమరజీవి' యొకండు
తెలుగునాడు నాడె తెచ్చిపెట్టె
అయిన నాంధ్రజనని యానందమునకింక
కోటిసుతులు లేని కొరత మిగిలె.

రాయ లొక్కవంక రాజరాజొకవంక
కౌగిలించుకొనిరి కన్నతల్లి
నా ప్రతాపరుద్రు డరుదెంచలేదని
చిన్నవోయె తెలుగువన్నెలాడి.

అదొ నవంబరు ఒకటి నవాంబరమ్ము
దాల్చి ఆంధ్రావనీమాత తక్కినట్టి
కోటికొమరుల నడిజేర్చ కొంగుజాపి
భాగ్యనగరికి వచ్చెసె భాగ్యమనుచు.

శ్రీ వేంకటేశుండు సింహాద్రివాసుండు
భద్రాద్రిపతి తెల్గుప్రభువులైరి
కాళేశ్వరాఢ్య ద్రాక్షారామ శ్రీశైల
లింగమ్ము లొకనాట లీనమయ్యె
రాయలు రుద్రమ్మ రాజరాజనరేంద్రు
డీ ముగ్గురొక కోట నేలుకొనిరి
తుంగభద్రా కృష్ణ గంగ గోదావరి
మూడేరు లొకతోట ముదువుసూపె

ఆనాగే ఆంధ్ర ప్రదేశ్ తృతీయశైశవ ఘనుల ముక్కోటి బిడ్డల గన్నతల్లి
పండు ముత్తైద విద్యల పాడియావు
అఖిల భారతీయులపాలి అన్నపూర్ణ.

ప్రాచ్యదేశాంధ్ర శ్రీ మహాభారతమ్ము
భవ్య తెలగాణ శ్రీ మహా భాగవతము
మహిత రాయలసీమ రామాయణమ్ము
ఘన త్రివేణీసమాగ మాకారమూనె.

కలసియున్న సోదరులు వేరుపడుదురు
వేరువిడిచి వీరు చేరిరొకట
ఆంధ్రజాతిలోన నైకమత్యంబిల్ల
యనెడిమాట కల్లయయ్యె నేడు.

అలఘు ప్రేమలనెద నెద
యలముకొనగ మూడుకోట్ల యాంధ్రు లొకటియై
నిలిచిరి పాములు పాములు
కలహించిన విషము లుండగలవే యెందున్.

కన్నతల్లి ! ఆంధ్రులపాలి కల్పవల్లి
ధాత్రి ! ఆంధ్రప్రదేశమాతా నమోస్తు
అంబ ! అజయవై అమరవై ఆత్మసుతులు
గొలువ నాచంద్రతారార్క మలరవమ్మ.

నా న మా మ లై

# మహా ప్రభాతము

ఎన్నినాళ్ళ స్వప్నమిది సత్యమైనది
ఎన్నినేళ్ళ పిలుపుకిది జవాబు
నాల్గుకోట్ల వికచ నాళీకములు గల
ఆంధ్ర సరసికిది మహా ప్రభాతము

---

దాశరథి

---

రక్తకాంచన తరుప్రతతి శారదవేళ
పూవులతో పొంగి పోయినట్లు
శశికాంత పాషాణచయము వెన్నెలలలో
కరగి నీరై కాల్వ గట్టినట్లు
చంద్రబాహుద్వయీ సాంద్రోపగూహమ్ము
కల్హారమునకు పుల్కలిడినట్లు
రాజహంసీ గరుద్రచిత బాల తరంగ
రంగవల్లి సరోజలమ్ములట్లు

తరతరమ్ముల చీకటి బరువులుడిగి
వానమబ్బుల కర్దమ పథము కడిగి
నాల్గు చెరగు లొక్కటియైన నాల్గుకోట్ల
తెలుగు లోకాన చైతన్య మలమికొనియె.

అగరు సువాసనా ఘుమ ఘు
మాయిత కేశభరమ్ముతోడ, సం
పెగ పువువంటి ముక్కున సు
మించిన అందముతోడ, వానకార్
మొగిళుల గొంగళీ ముసుగు
పోయిన పూర్ణ శశాంక చిత్రకం
బగువడ మోమునన్ మధుర
హాసమునన్ తెలుగమ్మ వచ్చెడిన్.

ఒకవైపు కృష్ణవేణిక ఉబ్బి తబ్బిబ్బు
        లై సాగి తెల్గింట సేసపెట్టి
ఒకట్రేవ గోదావరికి హర్షలహరికా
        నాట్యంబు ప్రసన్నందనంబు కూర్ప
ఒకప్రక్క తుంగభద్రకు చాయ వెన్నెల
        కెరటాలు తెలుగు సంబరము చేర్ప
ఒకదారి మంజీర చకపిక నడలతో
        తెల్గుతల్లికి తరితీపు సేయ

సుజలయై తెల్గుతల్లి సంశోభిలంగ
సుఫలయై తెల్గుధాత్రి విస్ఫూర్తిజెంద
బిదరు పురినుండి వంగాబ్ధి వేలదాక
ఏకమైపోయె తెలుగు వారిల్లునేడు.

నా జీవితమున సత్యము
కాజాలదటంచు తలచి కడుదుఃఖముతో
బేజారైతి; మహాంధ్ర
శ్రీజాగే లేకవచ్చి చిందులు ద్రొక్కెన్.

దా శ ర థి

ఇక వికోన్ముఖులై మహాంధ్ర ధరణీ
హృష్టాంతరం గోజ్జ్వల
ప్రకటోదార జనమ్ములార! కవితా
పాఠమ్ము గావింపు, డాం
ధ్రికి పూజాదికముల్ ఔనర్చుడు, చిర
శ్రీహ్రాభారమున్ ద్రుల్చి నిం
గికి తాకన్ తలలెత్తు డాంధ్రధరణీ
కీర్తుల్ ప్రభాసింపగన్.

పాల బాటపైన బడిపోపు చుక్కల
బాలులట్లు తెలుగు వారలెల్ల
బ్రతుకులందు పూల బాటలు పరపించి
నేటినుండి నడడు నేర్వవలయు.

మనసు మల్లె పొదల వెనకనుండి హసించు
కనికరంపు చంద్ర కాంతితోడ
బ్రతుకు టంధకార పథముల మల్లెలు
మొల్ల విరులు విరియ జల్లవలయు.

వానతెరలు తొలచి వచ్చినట్టి మహాంధ్ర
దేవతా కరస్థ దివ్య పాత్ర
తొణకి అమృతధార దోసిటం బడినది
త్రావుడాంధ్ర పుత్రులార! మీరు.

# సంస్కారధార

సుప్తాత్మునిలోన బాల
సూర్యుడు మేల్కొన్న యపుడు
మూర్ఛితునికి మరల ప్రాణ
ములు దానము చేసినపుడు
చివుళ్ళెత్తు ఒక మహాను
భవము, ఒక రసోత్త్రవము
కవినగు నా లోన నేడు
కనిపించెను, వినిపించెను,
ఈ యనుభూతికి గీతికి
ఏనాడో ఎడారి యైన
ఎడద ఒకుమ్మడిగ పొల : .

---

నారాయణ రెడ్డి

---

కడలియై కరళ్లు ద్రొక్కె
ఎన్ని యుగమ్ములు మారిన
పున్నెపుటను భావమ్మిది
ఎన్ని జన్మములు మ్రోగిన
హేలామయ రావమ్మిది
దొరగిలిన మన్మానస
దుగ్ధసాగ రోర్మ్ములలో
గొంతులు సవరించుకొనె త్రి
కోటి కచ్ఛపులు మహతులు
కృష్ణవేణి తనచిర సం
కీర్ణవేణి కేలబూని
అల్లుకొనుచు నన్నుగాంచి
అగిపోయె పులకరించి.
గోదావరి తన పురాని
గూఢ గాథలను స్మరించి
తనలో తా నవ్వుకొనుచు
ననుగని లజ్జిత మయ్యెను.
మంజీర నిజామల పద
గుంజ న్మంజీరావళి
జీరాడగ వచ్చి నన్ను
జేరి మోము వాల్చుకొనెను.

ఘని విలాసిని మణీ
గణము నా సమక్షమ్మున
నిలువగ అపర ప్రయాగ
మొలిచి నట్టు లనిపించెను.

అంతట నాలోని సాగ
రాత్మ పొంగు లెత్తి యెత్తి
నదీ త్రయమ్మును గుండెల
కదుము కొనెను గాటమ్ముగ.

ఈ యపూర్వ ఘటన తోడ
ఎగిసి ఎగిసి నా ఊహాలు
మిన్నందెను నేనైతి స
మీచిన మహోల్లేఖక
ప్రాచీనాంధ్ర ప్రతాకగ.

కవి వత్సలులైన హాలు
గాథాసప్త శతి నైతి
శాతకర్ణి భూతలేంద్ర
సమక్షమ్ములో జరిగిన
అగ్నిష్టోమ యాది మహా
యజ్ఞ హవిశ్శ్రేణి నైతి.
అజంతా గుహా సరస్సు
నందు పద్మపాణి నైతి.

నా రా య ణ రె డ్డి

అమరావతిలో గంధ
ర్వాంగనలకు వీణనైతి.
వల్లె పట్టులందు మరుగు
వడిన తెల్గు సరస్వతిని
రాచగద్దెపై నిల్పిన
రాజరాజ మూర్తినైతి.
తెల్గులకొక దివ్య సంస్కృ
తిని భిక్షుగ నందించిన
సనాతనుడు నన్నయ్య ప్ర
సన్నకథా గీతి నైతి.
హరిహరులను ముద్దజేసి
అయువులను బోసి జగతి
ప్రతిష్ఠించినట్టి కవి
బ్రహ్మ కావ్యరీతి నైతి.
ఐతి నంత రుద్రమ్మ క
రాంచల చంచత్ కృపాణ
చకితద్యుతిగా; కాప
య్య కృతోద్ధత హుంకృతిగా.
అంతనైతి రెడ్డి రాట్స
మర్పిత కనకాంబరాఖ్య
లంకృతుడగు శ్రీనాథుని
ప్రౌఢ పద్య ఝుంకృతిగా.

పోతన్న సుధాఖండ
స్యూత భాగవత కృతిగా.
కత్తి గంటముల నొక్కటి
గానడిపిన కృష్ణదేవ
రాయ 'భువనవిజయ' భవన
రాజద్గోపుర మైతిని.
మధురలోన తంజాపురి
వదనములో నర్తించిన
పలుకు వెలది పైడి అంది
యల క్రేంకారమ్ము నైతి.
అర్వాచీ నాంధ్ర జగత్
సర్వతో ముఖ ప్రతిభా
నిర్వచనము సేయు కవి
జ్ఞేకరవచో ముకురమై తి.
నవాంధ్రా వతరణావస
ర విఖ్యాతచ్ఛవి నైతిని
ఐతి సుమా! నేనే 'నా
గార్జున సాగర' మైతిని.

---

నా రా య ణా రె డ్డి

---

# ఉదయరేఖలు

భవ్యశారద కార్తిక ప్రతిపదిందు
రేఖ తనభాగ్య నగర కీర్తికి పతాక,
మూడురేకుల విరిసిన మొగిలిపూవు
తనదు క్రైశ్యమ్ము వాసింపఁ దగినతావు,
వరుస ముక్కోటి ప్రభల జాతరలుసేయు
తెలుగు వారలు తనకు భక్తులును సుతులు
గాగ తామర తంపమౌ కలిమితోడ
తేజరిల్లుత ఆంధ్రప్రదేశ లక్ష్మి.

---

కేశవపంతుల

---

పూవుల్ వెట్టి దిశావధూ శిరములన్;
ముద్దాడి జాబిల్లి; దప్పి
గ్భావంబుల్ పచరించి శేషునికడన్;
బాంధవ్యముల్ సెప్పి వా
ర్ధి వీసన్నిధి; ముద్దుముచ్చటలచే
దివ్యాపగం దేల్చి; స
త్త్వాపీణ్యంబు వెలార్చుగాక యిక
నాంధ్ర శ్రీ యశోమూతికల్.

తనగద్దె శేషుని ఫణ సహస్రంబయి
ముదురు రత్నాలతో ముద్దుగులుక
తన కిరీటము మేరుధరణీధరాగ్రమై
పసిడి కాంతుల దిశా పంక్తిఁబూయ
తనదు హారాళి కేదారవత్తట నదీ
గ్రామమై పచ్చల రంగులీన
తన దుకూలము మేటి తరగల సంద్రమై
కుచ్చెళ్ళ మడతల మెచ్చుఁగూర్ప

దీప్త పరిపాలనం బెల్ల దీవులందు
బహుమతికి పాత్రముగ మించు భరతమాత
గన్న రాష్ట్రోత్త్మ జలలోన మిన్నయగుచు
తేజరిలుగాత అఖిలాంధ్ర దేశలక్ష్మి.

మ్రోగుగావుత ఇంక మొనసి నీ పాండితీ
డిండిమంబఖిల దిఙ్మండలముల
పారుగావుత ఇంక భవదీయ కవితా స్ర
వంతి ఖండాంతర ప్రాంతములను
పరయుగావుత ఇంక ఉజ్జ్వల తావక
శేముషీమణి విపశ్చిన్నికషము
మెలగుగావుత ఇంక లలిత యుష్మద్యశో
రమయింట సింట భారత ధరిత్రి

జగము పులకింప కవిమేను జలదరింప
మధురతర తావ కానర్ఘ మంజు వచన
రచన లికనెల్ల దీవుల బ్రచుర దీప్తి
నందివెలసెడు గాత; మా అంధ్రమాత !

తడిసిన కనుల నద్దగనిమ్ము మనసార
తల్లి ! నీపాద పద్మద్వయాన
అదిరెడు గుండెల హత్తుకో నీవమ్మ !
భ్రాతృవత్సః పిత భాగములను
చెనటి మాటలువిన్న చెవులఁ జేర్పగనిమ్ము
ధన్యాతి ధన్య ! స్వాతంత్ర్యగీతి
వడకు చేతుల గంట వాయింపఁ గానిమ్ము
తల్లి ! నీపూజా విధానమునకు

---

కే శ వ పం తు ల

---

పర్ఫర ఖయాతిరేప దేమాయపూన
దేహము ప్రదక్షిణముచేసి తేరనిస్ము
సర్వైక్లబ్య భావంబు సమసిపోవ
మూడుకంతాలు నేకమై పాడనిమ్ము.

చుక్కలు చంద్రునిన్ గులికి
చూచెడువాక సరోజ బాంధవుం
డక్కరమీరఁ బద్మిని స
హస్ర కరమ్ముల కౌఁగిలింపఁగన్
జొక్కి రమించువాక, గుణ
సుందర మేక సితాత పత్ర మీ
ఒక్క మహాంధ్ర రాష్ట్రమది యున్నతి
గాంచి జనాళిఁ బ్రోచుతన్.

# మహాంధ్రావతరణము

సెలుగుల బడి నలిగిన మా
తెలుగుల హృదయములు గట్లుతెగి యానందం
బలుగులు వారె, మహాంధ్రం
బిలకు నవతరించినట్టి ఈ శుభవేళన్.

పల్లా

రంగత్తరంగాల కొంగు జెండాలెత్తి
గోదావరమ్మ ఆమోదమొసగ
కలకండ లొలికించు కలకంఠ రవమెత్తి
కృష్ణమ్మ మంగళ గీతిపాడ
కెరటాల కేలెత్తి చిరు ముత్తెములు చిమ్మి
పెన్నమ్మ సేసలు పెట్టుచుండ
శృంగార రస సముజ్జృంభమాణ కటాక్ష
తుంగమ్మ తలయెత్తి తొంగిచూడ

ఆంధ్రరాష్ట్రము రాజ చిహ్నములతోడ
తరలి వచ్చెను కర్నూలు పురము గదలి
భాగ్యనగరికి, ఈ స్థాన బలమదేమొ
తేజరిల్లె మహాంధ్ర ప్రదేశమగుచు.

నాలుగు కోట్ల తెల్గు వద
నమ్ములు నల్వది యేండ్ల నుండియే
కాలము కోసమై తెలుపు
గన్నులు కాయలు గాయ సంశయా
లోల విలోకనమ్ముల వె
లుంగుల దిక్కులు చూచునాఉషః
కాల శుభోదయమ్మగుడు
కన్నుల పున్నమమ్మై రహించెనుజా.

విజయ దశమికి మఱియు నాశ్వీజమాస
బహుళ దీపావళీ మహా పర్వములకు
నడుమ కొసరుచువచ్చు ఆంధ్రప్రదేశ
పర్వమెవరికి నేత్ర పర్వమ్ముగాదె !

తాతల నాటి వంపకపు
తప్పాన ముప్పు పుట్టిల్లి తల్లికిఙ
కోతలుగాగ సంతు కసి
గుంపుల పాలయి చీలిపోవుటన్
లాతిజనుల్ వలెన్ పెనగు
పాడు దినాలు గతించి చేతులున్
చేతులు జేర్చి యొక్కెడకు
చేరు శుభాహము వచ్చెనేటికిన్!

ఊరక మింటినుండి తెగి
యూడిపడెఙ భువి నీ మహాంధ్ర మం
దారయరాదు తమ్ములును
నన్నలు చిన్నలు పెద్దలేకమై
చేరి యొనర్చు త్యాగకృషి
చేతల సత్ఫల సిద్ధి; దీనిపెం
పొరెడు బుద్ధిదిద్ది విపు
లార్థయుత మ్మొనరింప గా దగుఙ.

దుక్కి యొక్కఁడుదున్నె చక్కఁజేసె నొకండు
విత్తనమ్ములు వెద వెట్టెనొకడు
నీరుపోసె నొకండు నారు పెంచె నొకండు
నారుదీసి పొలాన నాటెనొకడు
కలుపుదీసె నొకండు కాల్వ నొక్కఁడుదీసె
నొడిసెల బెడిసెల నొకడు దోలె
కంటవత్తిడుకొని కాపుగాసె నొకండు
పంటగోయించె కుప్పలుఁగ నొకడు

పంజ గొట్టించె నొక్కఁడు బంతిగట్టి
పట్టె నొక్కఁడు తూర్పార పండితుండు
సాగె పొలిబోయ స్వాతంత్ర్య సస్యరమకు
కొలువ రండన్న లెదల తూములను దీసి.

నీలాంబరము నవంబరు
కాలాగత శారదాభ్ర కర్పూరపు ని
వ్వాళుల పళ్లెర మెత్తెను
వేలాది తెలుంగు లోకట వేడ్కఁపడుతరిణా.

తెలుగు ప్రజలెల్ల రొక్క వేదికకునెక్కి
శిథిల దాస్య దుకూలముల్ చించివైచి
నవ్య జీవన పథములో నడుము గట్టి
గా మహాంధ్రము సంజీవ కరణి యయ్యె.

అలనాటి సాతవాహన చక్రవర్తుల
పరిపాలనా ధురంధర సిరూఢి
చుళికిత భారతసూక్తి సుధానిధి
చాళుక్య రాజభాషా రిరంస
ఏకశిలా ప్రభుత్వైక కాకతిరాజ
శిల్పకళాసక్త చిత్రవృత్తి
విద్యానగరరాజ్య పృథ్వీశుడగు కృష్ణ
రాయల కవితా పరాయణతయు

రెడ్డివెలమల శౌను షోద్రేకములును
కార్యదీక్షయు సత్య సంకల్పశక్తి
యావహించుత యీ మహాంధ్రావతరణ
శుభముహూర్తమ్ము నంధాంధ్ర సోదరులను.

---

పల్లా

# విశాలాంధ్ర

దురితౌఘమ్ము ఫలమ్ముగాఁ దెలుఁగు పు
త్రుల్ భిన్నసంస్కారులై
పరులట్టుల్ వసియించి రిందనుక నా
పాపాంధ కారచ్ఛటల్
గురుయత్నార్క మరీచి మాలికలచేఁ
గూలంగ నానందభా
స్వరమై పూర్ణ మహాంధ్రరాష్ట్ర ఘటనో
పస్సిద్ధి సంధిల్లెడిన్.

దివాకర్ల

పరతంత్రత్వము ప్రాలుమాలికయుఁ జె
వ్వన్ రాని స్వ్యాతంత్ర్య మే
ర్పడుపజ్జ ఋూచ్వల వైభవోన్నతుల నే
పల్మారు కీర్తించుచుం
జరిత్రప్రస్తింగను తెల్గువారల కన
ల్పంబైన పుణ్యంబునన్
జిరసద్రా ప్రతిబోధమబ్బెను యశ
శ్శ్రీస్వ ప్రాప్తికిన్ హేతువై.

శాతవాహన-ధరాచక్రేశ్వరులు తేజ
మడరంగ నేలినయట్టి నాళ్ల
చాళుక్యవంశ రాజన్య చూడామణుల్
వేదధర్మమ్ము నిల్పిన దినాల
కాకతీయ వసుంధరాకళత్రులు కీర్తి
వెన్నెలల్ దెసలఁ బర్వించినపుడు
విద్యాపురీ పరివృఢులు తెల్గు కవిత్వ
కన్యకు నాట్యముల్ గఱపువేళ

తెల్గుజోదులు స్వేచ్ఛమై తెగి విరోధి
కంఠదళనమ్ము చేసిన కాలమంచు
బ్రాదికియుండని మేటికొఱంత తీరె
శుభ విశాలాంధ్రరాష్ట్రమ్ము చూచుకతన.

తల్లి తెలుఁగునేల సంపదఁ దల
తూగఁగ నేలినట్టి ఘన
పల్లవులెల్ల రల్లదె ద
వంబున బంతులుతీర్చి ప్రజయ దా
స్త్రోల్లసనంబు పుత్త్రుల మ
హోన్నతి చూచుచు మోదబాష్పముల్
జల్లులుగా సుఖాశ్రుమము
లం బరగింతు రమోఘ వాఙ్మ్యులన్.

గ్రామ గ్రామమునందు నింతఁ గపతి
క్కన్నల్ మతిదొడ్డ గురు
స్వాముల్ తిమ్మరుసుల్ స్రుతిప్రచయ త
త్త్వజ్ఞానులౌ మాధవుల్
వేమన్నల్ మఱి త్యాగరాజులును ప
ద్మి రత్నముల్ రుద్రముల్
శ్రమించన్ జనియించి రాష్ట్రమునకున్
శ్రేయస్సు చేకూర్చుతన్.

# అద్వైతగీతి

ఓ ప్రభూ! నేఁడు మమ్మొక్కపరి పిలువు
మా బహ్యాత్తర మనుష్యత్వమునకు
ఉద్ధరింపుము దేవ! యుభయాత్మికాభావ
విచ్ఛిన్న విషమ జీవితమునుండి
హృదయ తంత్రుల విస్తరింపఁగఁ జేసికొం
పొమ్ము మమ్మేడుదీవులకుఁ బయిగ
అమృత పుత్రులఁ జేసి యందింపుమా నీదు
శాంతి సందేశ మా శాంతములకు

---

ఉత్పల

---

కాత్మ సుత రసాత్మకమగు సద్వైతగీతి
విశ్వ సంగీతమున మేళవింపఁ జేసి
స్నేహ దీపావలోకన శ్రీలతోడ
ఏక మొనరింపు మిమ్మహా లోక మెల్ల.

ఏ యింట వెలిగిన నేమి యీ దీపమ్ము
లింటింట నొక కాంతియే రహించు
ఏ చోటఁ బుట్టిన నేమి యీ పసిపాప
సర్వ మానవ సమాజమ్ము వాఁడె
ఏ పాటఁ బాడిన నేమి యీ దినమున
ధ్వనియించు రాగ వృత్తం బొకండె
ఈ రోజు నా యింట ద్వారాలు తెఱతు నా
హూతులకును ననా హూతులకును

రండు మీకందఱకు సోదరుండ నేను
వ్యక్తిగత మెల్ల నేఁడు ప్రాపంచికమ్ము
నర్చి సేవింతు నా జగన్నాథు నవరి
పూర్ణ మంగళాలంకృత స్ఫూర్తి మూర్తి!

నదిగో దీపములెల్ల వెల్గె నిష్క
ంటకంటన్ దనూజాల మూ
విస్మృతం బైనది సర్వ మానవ మనో
వీధి సుహృద్భావ గా
రవ మవ్యాహత దివ్య దీపకళికా
లంకార నీరాజనో
త్సవమై పర్వెను దిగ్దిగంతర
పరీత త్రి విరాణ్మూర్తికిన్.

# తెలుగుతల్లికి కలువదండ

భారత దేశ భాషల ప్ర
భావము పారమెఱిఁగి సత్య మే
ధారమణీయ కోవిదులు
ధారుణి భాషల నెల్ల తెన్నయై,
నాదము గల్గి సొంపయిన
శబ్దములన్ విలసిల్లి, భావసం
పాదము, గాన మాధురి, ర
సధ్వని పోఁకడ లెల్ల తావులం

గూరినదై చెలంగు తెలు
గుం గడుస్తోత్రము చేసినార; లో
ధీరవ రేణ్యులార! భవ
దీయసుపుణ్య మగణ్య మయ్య! యీ
తీరుల పావనంబయిన
తెన్గు పొలంబున జన్మమంది యిం
పారగ మాతృ శారదకు
అర్చన సల్పెడు భాగ్యమబ్బె; మీ
కోరిక లింక దీఱ కవి
కోకిల వాక్సుమాంజలుల్ ముదం
బారగ దేశ మెల్లెడల
హర్మ్యతలంబుల పూల పందిరుల్
చేరగజేయు; భాషకును,
సీమకు, వ్యక్తికి, జాతికిన్ సదా
కోరిక దీరి కల్గిన న
కుంఠితమైన తెలుంగు వాయు సం
చారము గల్గెడిన్; తెలుగు
శారద కుయ్యెల గట్టి ముత్తెముల్
చేరులు గూర్చి పాడుతతి
చేరువ యయ్యెను; లెండు; విశ్వమిం

తెలుగు తల్లికి కలువదండ

పొరగ జూడు డయ్య! మన
యాంధ్రుల సంస్కృతి నుద్ధరింపగా
జేరుడు; తెల్గుదేశము వి
శిష్టత నిల్పుడు తెల్గు సోదరుల్!

సంతత వైభవంబు, కడు
శాంతి, అహింస, శుభంబు, సౌఖ్య, సు
శ్రాంతదిగంతకీర్తి, పర
రాజ్యహితంబు, పరాక్రమంబు, జా
త్యంతర సానుభూతి, నిఖి
లాంధ్రుల మానస సీమలందు అ
త్యంతము ఎల్లవేళల వి
హారము సల్పుత తెల్గు సీమలో.

# సర్వాయి పాపన్న

(తెలంగాణ ప్రాంతములో ఒకనాటి కాకరాత్రిలో అపుడపుడు మెరసిన మెరపీ సర్వాయి పాపన్న).

ఈ నడుమన్ - మహాంధ్ర విజ
యేందిర పీఠిక వంటి బుర్జు క
న్నాను - మనస్సులో శత పి
నాకులు, షాహపురీ ఖిలా శిలా
లీనులు, శక్తి సంయుతు, ల
లింగిత భీకులు, ధర్మరతుణా
ధీనులు - దివ్య తైజస వి
ధిణ కను పించిరి పెంచిరాత్మతణ.

ఈ ఎత్తైనవి కోట గోడలు - మహా
హేలా విలాసిన్, స్వాధీ
యా యత్తీకృత సైన్య రక్షణ చణ
వ్యాపార నిష్ణాతు, హిం
సా యోగానత వైరునిః, హను మదం
శా ఖ్యాతు, హిందూమత
స్ఫాయత్ శీర్ష మణిప్రఖ్యాతనువు, స
ర్వాయిః స్మృతిం దెచ్చెదుః.

వధియింప బడ్డ సర్వాయి పాపన్న శి
రమ్ము గా బురుజు భైరవత పొల్చు,
పై నొక్క శుష్కితపత్ర వృక్షము వాని
తల బెట్టిన తురాయి తలపు దెచ్చు,
ఆ చెట్టు నీడ లందందు ఖిలాకెగ
బ్రాకెడు సైనిక ప్రతతి బోలు,
ఈ బురుజీకోట ఎంతయు నొప్పు నం
ద్రమ్ములో నున్న మందరము మాడ్కి,

ఏమి బురుజేమి దుర్గమ్ము నేమి కతలు!
ఇచట నెల్ల మృత్కణముల ప్రచురమగును,
ఏ మహా దేవుడో తాండ వించినట్లు,
ఏ మహా నందకమొ చలి యించినట్లు.

రోమాంచమ్ములు కల్గు పాపని, తదు
ల్లోక ప్రభా రీతి, గ
న్నామా? తత్కృథలన్ ప్రభోయుగళి పం
థన్ జేర్చినామా? కృథా
ఘామో ద్వాము నిటాల సంచలనముల్
ధర్షించినట్టి ఎదన్
ఏ మేమో భయముల్ ముదమ్ములును క
ల్పించున్ ద్విధావాదముల్.

ఏ తెల్గు పీరుని ఎన్ని ఉచ్ఛ్వాసాలు
ఈ వాయు వీధి సంభావితములు,
ఏ విజితారి ఎర్గెత్తిన సింహ నా
దాలెన్ని యభ్ర పథావృతములు,
ఏ మహోహోశాలి యిచ్చా పథాలెన్ని
బ్రహ్మర్చి రహిత సంపద్ధరములు,
ఏ లోతు ఎద గల యొకిమీని కనులలో
దుఃఖములెన్ని అంధు పతితములు,

ఎవడో? ఎత్తైన తాడి చెట్టెక్కి కల్లు
గీయు వాడు వనీ వట చ్ఛాయ భుజగ
ఫణ సమాకల్పితచ్ఛత్ర భవ్యవైభ
వుండు సర్వాయి పాప రాయండు వాడు.

ఒక నా సాంధ్ర ఘనావిభూతి, ఒక ఘ
ర్మోచ్ఛేది హస్త్రాల ని
స్స్వాకమై పోవగ చూచిచూచి హ్యాసయు
జ్యాఘోషతో లేచి ఆ
వికసల్లక్ష్మిని గొంచుతే నసుపులన్
వెచ్చించె, ఆంధ్రోజ్జ్వల
ప్రకటత్ శౌర్యుడు పాపరాయుడు సుహాం
ఛః పూర గంభీరుడున్.

కీలల్ నొక్కుచు ప్రేల్చుచుండిన ఫిరం
గీ గుండ్లకున్ ముక్కలై
కూలెన్ వైరి శిరస్సమూహములు, నా
కుప్పల్ మహారక్త ధా
రాలోలమ్ముల వాహినీతతుల వె
య్యార్లన్ సృజించెన్ ఖిలా
షాలీలాపద వీథులన్, హృదయముల్
స్పందించెడున్ నేటికిన్.

ఒక 'సీతాపతి' 'పాపరాయడొ'కడాం
ధ్రోర్వీ మహావీర ధా
వకవిత్త్వమ్మునకర్థ శబ్దములు, పూ
ర్వ ప్రాభవమ్ముల్ వికా

వికలై పోవగ నేటి కాంధ్ర జన హృ
ద్వీధిన్ పురాశీర్ణరే
ఖికలైమాత్రమె నిల్చియుండినవి, సా
గిన్సాగుచున్ వెల్గులై.

# మోదోద్ధతి

ఉల్లోలన్మన ఉత్థితోజ్జ్వల గత
వ్యోమంకషత్ తెల్గుశా
ర్యోల్లాసమ్ములు నేత్ర వీథికల వి
ద్యుత్ చిత్రముల్ గూర్చు సం
పల్లీలాతిగ నిత్యనూత్న జనతా
పారంపరీ ప్రాప్తగా
థోల్లీథత్వము గుండెలోతుల మహ
త్వోహల్ పిసాళించెడున్.

---

సంపత్కుమార

---

సద్రాణీ ద్విత యాపత్తారషుగ త్రె
ళ్లు శ్రీ ప్రతాపచ్ఛటా
భద్రావేశము రుద్రమా కరతల
ప్రాంచత్ కృపాణాభ్వ మం
దుద్రేకించినివాడు నే నయిన వా
డొక్కండు తెల్గుండు సౌ
రద్రుః పుష్పములన్ దిగంతముల క
ల్లన్ జేయుచున్నాడహో !

మధ్వామోహక తెల్గుదైశికవచో
మాంగల్య రూపమ్ము ది
వ్యాధ్వవ్యాప్త చిరంతనోజ్జ్వల మహో
హాళి ప్రసారమ్ము దౌ
ష్ట్యధ్వాంత ప్రఖర్మాత నిశ్చయ దిన
స్వామి ప్రకాశమ్మునై
సాధ్వాన్నత్యపుమూర్తి పోతన ప్రపం
చ శ్రీ స్వరూపమ్ముగా.

నవనీతాయిత కర్కశోపలతలీ
న్యస్తాంగనా భంగిమా
ది విలాసమ్ములతోడ నున్నత మహం
ద్రీ శిల్ప సంపూర్ణతా

---

మోాదోద్ధతి

---

వ్యవసాయమ్మున శిష్టతల్ పిరియు శి
ల్పగ్రామణుల్ స్వీయ నా
మ విశేషమ్ములు తెల్పనన్ విజిత స
న్మాన ప్రథా కీర్తులున్.

దీపాలెత్తుడ ! పూలుచల్లుడ ! మహాం
ధ్రీదేవి సల్కొట్ల ఆ
త్మోపాంతమ్ముల వచ్చి నిల్చినది వి
ద్యాస్మార్తియై, సత్తపో
వ్యాపారమ్ములు నేటి కీవిధి ఫలిం
పజ 'రామ' నామమ్ముతో
దీపాల్ త్రిప్పుడ ! పూజసేయుడ ! గతా
త్మీయత్వముల్ పొంగగన్.

ఈ గుండెల్ జయభేరులై తెలుగు సా
హిత్యమ్ము దిగ్వీథులన్
మ్రోగున్ నాడులు వీణతీవెలయి సం
పూర్ణాంధ్ర రాష్ట్రోన్నత
శ్రీ గీతమ్ముల పల్కు ఆంధ్రుల యశ
శ్రీ ఎల్లకుజ వెల్లగాన్
బ్రాగాంధ్రోజ్వల దివ్యదీధితులు స
ర్వమ్మున్ ప్రకాశింపగన్.

---

సంపత్కుమార

---

# మా తల్లి

యావద్భారత వీర ధర్మములకీ
యాంధ్రమ్ము కేంద్రమ్ముగా
త్రోవన్ జూపి చరిత్రకెక్కెను: శుభో
ద్యోగుల్ గుణుల్ మాతృభూ
సేవాజీవులు తెన్గువారలన మిం
చెన్ కీర్తి మిన్నంది, ఆ
జీవన్మృత్యు వనాథ జన్ములకు,
ఇస్సీ నీకు లే దెవ్వడున్.

నీ వొక జీవ జాతిని జ
నించిన వాడవు – విస్మరించ కీ
భావము! నీ చరిత్ర బహు
పౌరుష గాథ – స్మరించు కొమ్మ! ని
ర్జీవము లైన జాతులు న
శింపక తప్పదు – మేలుకొమ్మ! నీ
వే విజయధ్వజమ్మెగుర
వేసెడి వాడవు – లేచిరమ్మ రా!!

అదిగో దేశచరిత్ర యందొక సహా
ధ్యాయమ్ము ప్రారంభమై
నది! అందొక్క మహోజ్జ్వలమ్మయిన స్థా
నమ్మాక్రమింపంగను
న్నది నీ జాతి! పురోగమించుటకు స
న్నద్ధుల్ మహేంద్రోర్వి బు
ట్టిన ముక్కోటి తెనుంగు లీదినము, తం
డ్రీ! త్రవ్వరా! దున్నరా!!

తెనుగుల వేష భాషలొక
తీరువి, వారి పరస్ప రార్ద్ర వ
ర్తనముల వొక్క తీరువి వె
తల్ మురిపెమ్ముల వొక్కతీరు లౌ

ర! నరనరమ్ములన్ తర త
రమ్ముల నుండి అనాది సైజమున్
ఘనముగ దాచుకున్నది, అ
ఖండముగా మహదాంధ్రి రెండునై.

పరిణతమైన సాంస్కృతిక
భారత మందు కళా పురోగతుల్
జరిగెడి వేళ మా తెనుగు
చక్కదనాల ఒయారిజాణ ని
బ్బరపు నడల్ గతమ్మునకు భావికి
వన్నెలు దిద్దగా వలెన్
గురుతర కార్యభారమున
గ్రుంగెడి తల్లి కెదింగినట్టి కూ
తురువలె, చేతసౌపనుల
తోడ్పడి మక్కువ నందగావలెన్.

# తెనుగు మినుకులు

కనుము కనుము రసాల పల్లవ
కలిత తోరణ మింటికొక్కటి
వినుము వినుమదె తెనుగు గొనముల
విజయనాదము పూర్వదిక్తటి
తెనుగుజనములు తెనుగుమనములు
తెనుగుదనములు మధుపవనములు
తెనుగువనములు తెనుగువనములు
తెనుగువనములు గొనబు ధనములు.

౧ త్రైపల్లి

లలిత లలిత చళుక్య చంచ
ల్లాంఛనములు స్ఫురించె నదుగో
పిలుపు పిలుపున కాకతీయో
జ్జ్వల చరిత్ర ధ్వనించె నదుగో
పలుకు పలుకున రెడ్డినాయక
కలరవమ్ముల కలరవమ్ములు
మలపు మలపున విజయనగర స
కల కలా కిలికించి తమ్ములు.

మేలుమే లమరావతీ శి
ల్పాలపాల సరస్సు లూరెను
జాలు జాలుగ నోరుగల్లుపు
రాల మధుర పయస్సుగారెను
మూల మూలల శ్రీనగపు వి
ద్యాలయాల యశస్సు నిండెను
లీల లీలల పానుగంటి శి
లాలయాల తపస్సు పండెను.

తర తరాల తెనుంగు శిరముల
సిరులు వేణి పరిమళించెను
ఇరుగు పొరుగుల బొరలి స్నేహపు
ఝరుల 'తుంగ' తరంగలించెను

తరళ తరళ రసాల గోదా
వరి వరాల్మొలిపించె సురభిగ
పరుగు పరుగున 'పెన్ని'సింగులు
బఱచి విరులను బంచె విరివిగ.

పూవు పూవునఁ గ్రొత్త దేనియ
పొంగి పొంగి స్రవించె దేనికి ?
తీవ తీవకు తెనుగు తీపిని
దెచ్చి ముచ్చట బెంచుటానికి -
తావి తావికి దివ్యమరుదు ప
ధాన మానసమేల గలిగెను ?
జీవి జీవికి యాంధ్ర జగదుప
జీవ భావసుమాలు మొలిచెను.

## ఆంధ్ర!

క్షాత్రశౌర్యస్ఫూర్తి జాటెదిగ్వీధుల
రాజనరేంద్రు సంగ్రామ ఖేరి,
రాట్కుల విక్రమరాజి పెంపొనరించె
కృష్ణ రాయని జయ శ్రీ విభూతి,
వీరాంగనా యశోవిభవంబు వెదజల్లె
రుద్రమాంబిక పట్టభద్రగాథ,
ప్రభువుల సామ్రాజ్య పటిమ వెల్లడి జేసె
కాకతీయుల బాహు కౌశలంబు

---

తిరుమల

---

రెడ్డి రాజుల ఘాటిక సత్తువెదు,
వెలమ కత్తికి నెసమైన బలమెలేదు
తెలుగునాయల కీర్తికి సిలుగులేదు
పారజూడుమో యాంధ్ర! నీ వారి గరిమ.

ప్రౌఢ ప్రబంధంబు భారతా కృతిచెప్ప
శబ్దశాసనుని వాక్పౌష్టవంబు,
శాంతిసప్తకము శశ్వత్ స్థాయిగా నిల్ప
తిక్కయజ్వ కవిత్వధీసుశక్తి
భక్తి వైరాగ్య భావంబు చిగిర్చె పో
తనుకవి భాగపతంపు సొంపు
కావ్యకన్నియను చక్కని సొమ్ములందిర్చె
కవిసార్వభౌము శృంగార ఫణితి,

తెలుంగు చెలువకుఁ గులుకుల వలపుఁ దెలిపె
గూచిమంచి తిమ్మ కవీంద్రు గొనబు పలుకు
కడచి చన్న చరిత్రార్థ గర్భములను
పారజూడుమో యాంధ్ర నీవారి గరిమ.

ఏ పితామహుని కావ్యేందిరారమణి భూ
పాలు బంగరు పల్లకీల నెక్కె
నే కవి కుసుమ విజృంభిత వాసనల్
కృష్ణ రాజన్య సత్కీర్తి నిలిపె

నేవికటాశు ధారావిభాసు ప్రశస్తి
కవి శిఖామణుల సంజ్ఞలనె తుడిచె
నే కావ్యతీర్థు నస్తోక కావ్యముజా౽టె
శ్లేషవచః పరిభాషణంబు

నట్టి దిగ్దిగంతవ్యాప్త మైన యశము
మూటగట్టిరి మును నిను బోలువారె
కాదనంటివి దుష్కాల గతికి జిక్కి
పారజూడుమో యాంధ్ర ! నీవారి గరిమ.

శ్రీమదాంధ్రావనీ సేవజేయు శుభము,
యావదాంధ్రాళి గొల్చు సంభావనంబు
పూర్వ మహిమంబు స్మరియించు పుణ్యఫలము,
దొరికె నాంధ్రప్రదేశావతరణగరిమ.

# ఆంధ్రావతరణము

అదిరా! యెన్ని దినాలకబ్బె మనకీ
ఆంధ్రావతారోత్సవా
భ్యుదయ మ్మాంధ్ర తపస్సు పండెఁగదరా!
యుత్సాహమే పారఁగా
నిదె! "సంజీవి" లభించె మూర్ఛ విడి పో
యెన్, మీరు, మేమన్న, వే
రది శాంతించిన దీయదృష్టమున కే
రా! యిన్ని యారాటముల్.

గుడిమెళ్ళ

✓ కదిలెన్ నేటికి "ఆంధ్రలక్ష్మి" యదిగో
కర్నూల్ తెలంగాణముల్
హృదయమ్మొక్కటిగాగ సోదరులునా
నీర్ష్యావమాన వ్యథల్
వదులై పోవఁగ రాష్ట్ర రక్షణ కళా
భావి ప్రభా కాంతుతో
నెదురై స్వాగత మీయనుండుటిది నే
నెంతేఁ బ్రశంసించెదన్. ✓

"తుమ్మల" రాష్ట్రగాన మది
తొందరలే - దల "విశ్వనాథ" వా
రుమ్మలికంబు చెందఁబని
యుండదు - వీణకు దీగె జారుటన్
"కిమ్మ"న లేడు "దాశరథి"
కేలఁగలంబును గంట నశ్రువుల్
చిమ్ముచు వ్రాయు కావ్యములు
చిక్కవు మీకిక రాష్ట్ర సిద్ధికై.

✓కవి ఋషి గాన వాఙ్మయము
గాఁదపమూనుటఁ దత్ఫలంబుగా
నవతర ణోత్స వాభ్యుదయ
మబ్బెను నేటికి రాష్ట్ర లక్ష్మికిన్ ✓

గు డి మె ళ్ళ

సాములు వారలు దీనికోసమై
కవులె సుమా ప్రపంచ శుఖ
చివికి, కృశించి, క్రుంగి, వ్యథఁ
జెంది, యొసంగిరి నేడు రాష్ట్రమున్.

'వచ్చిన దాంధ్ర రాష్ట్రమిదె
పచ్చెను పచ్చని తోరణాలతో
ముచ్చట దీర భాగ్య పుర
మొప్పుచునున్నది వారు వీరునా
పొచ్చములేక మచ్చికలు
పొంపిరి వోవగ రాష్ట్ర సేవకై
కచ్చ బిగించి రందఱి దె
గా మన కోరిక - తీరెనేటికిన్

# మహోదయము

అరిసంతతులకు సింహస్వప్నమై యున్న
తెలుగుమగంటిమి యొలికె నెచట
రాజులు ఔంచ విభ్రాజితాంగములతో
తెలుగు పల్కుల వెలది కులికె నెచట
పసుపు కుంకుమతోడ పారాణితో తెన్గు
ఇల్లాలు కాపుర మెచట సేసె
రాళ్ళలో ప్రాణాలు చల్లి శిల్పుల తెల్గు
ఉలులు సౌందర్యంబుఁ జిలికె నెచట

ఊరుపుటూరి

ఆ పవిత్ర ధరిత్రి యీ ఆంధ్రభూమి
తలపునకు వచ్చి యొడలెల్లఁ బులకరించు
మరల పూర్వ మహోదయమందు వేళ
వచ్చె వెనువెంట తాను శుభమ్ముదెచ్చె.

ఓరుగల్లున సామ్రాజ్య ముద్భవిల్లి
పెరిగి పెంపొందిన చరిత్ర యెరిగి యుండి
తిరిగి జనరాజ్య మచట సాధించినాము
సూ భుజా లారుకోట్ల కంబాలుగాగ.

ఒకచేత జపమాల యుండఁ దెల్గుల పల్కు
చెలువ వైరాగ్యంబు జిలుకరించె
ఒక చేతిలో చిలుక యుండ కామము గూడ
పురుషార్థమే యని బోధ సేసె
ఒకచేత వారిజం బుండ సౌందర్యంబు
సత్యము శివముతో నిత్యమనియె
ఒకచేత పుస్తకంబుండ విద్దెలనెల్ల
నేర్చి విజ్ఞానంబు బేర్చు డనియె

నట్టి విత్తులు పొలముల నలికి తెన్గు
విరు గోదావరీ నీరు పారఁబెట్టి
పంట బండించి భాగ్యాలు బండ్లకెత్తి
గరిసెలను నింపితిమి యిక కరవురాదు.

# కేలుమోడ్పు

రమ్య గౌతమీ కృష్ణాతరంగిణుల వి
నూత్నసలిల సుస్నాత మనోజ్ఞమూర్తి
పచ్చపైరుల క్రొంబట్టు వలువగట్టి
కీర్తి తిలకంబు దిద్దిన గేస్తురాలు
మందహాస రుచుల్మొగమందుదోప
జయపతాకము జివురుహస్తములబట్టి
విజయగర్వ మాననసీమ వింతగొలుప
నిలిచియున్నది యొక మహనీయురాలు

జయలక్ష్మి

విశ్వవిఖ్యాత చాళుక్య వీరనృపతు
లాణిముత్తెపుటారతు లందజేయ
కాకతీయ రాజన్యశేఖరులు వచ్చి
కప్పురపునివాళులు ప్రియమొప్పనీయ
విజయనగరాధిపులు మహావిభవ మొప్ప
నతి మహోజ్జ్వల రత్నహారతుల నీయ
రెడ్డిరాజులు కనులు మిర్మిట్లుగొలుప
స్వర్ణ నీరాజనముల హస్తములబట్టి
కనుల నానందబాష్పముల్ గ్రమ్ముకొనగ
కరుణ వెదజల్లుచున్నదా కాంతమిన్న.

భారతము శిరోమణియౌచు ప్రజ్జ్వలింప
భాగవతము నాసామణిత్వము వహింప
వసుచరిత మనుచరితము లసమమైన
కర్ణకుండలయుగ్మమై కళలుదేర
మహిత యా ముక్తమాల్యద మంగళకర
కంఠహారమై విలసిల్లి కాంతులీన
కాశికాభీమఖండాది కావ్యతతులు
రత్నఖచిత కంకణములై రాణమీర
పాండురంగ మహాత్మ్యంబు భాసురమగు
నడుము నొడ్డాణమగుచు నందములజిమ్మ
భాస్కరునికృతి పచ్చలపతక మవగ

పుద్దుటుంగరమ్మై యొప్ప ముక్కుతిమ్మ
నార్యు కావ్యరత్నద్యుతి; నవనవీన
కృతులు భూషలై యొప్పార నతి మనోజ్ఞ
సుందరాకృతి వెలసిన సుదతిమిన్న
అమ్మ, మా యవనీమాత, యాంధ్రమాత
తల్లి, భాషామతల్లి మా తల్లి, యామె
రాజ్యలక్ష్మి స్వరూపిణి, రత్నగర్భ
కీర్తి బాడెద సతము కెంగేలుమోడ్చి.